శ్రీ గురుభ్యోనమః

# పుత్రశతకము


గ్రంథకర్త:

కవిరత్న లక్కన మల్లికార్జునుఁడు




కృతిపతి:

కొడాలి పున్నయ్యచౌదరిగారు

గ్రామసంఘము ప్రెసిడెంటు,

వల్లూరుపాలెము.








1938.




[వెల రు 0-3-0.

శ్రీ గురుభ్యోనమః

# పుత్రశతకము

గ్రంథకర్త:

కవిరత్న లక్కన మల్లికార్జునుఁడు



కృతిపతి:

కొడాలి పున్నయ్యచౌదరిగారు

గ్రామసంఘము ప్రెసిడెంటు,

వల్లూరుపాలెము.



1938.



[వెల రు 0-3-0

# విజ్ఞప్తి

మహాశయులారా !

శ్రీ వీరశైవగురుకుల భూషణులు 'వేదకావ్యస్మృతి దర్శన తీర్థసాహిత్యవిద్యానిధి' బిరుదాంకితులు ఈ పొత్తమునం దభిమతము వ్రాసిన యుదార సంపన్నులు నగు శివశ్రీ పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారి పాదపద్మముల కెరగి, ఇందు తొలిపలుకు వ్రాసిన మహామహులు బెజవాడ పాఠశాలల పరీక్షాధికారులు నగు బ్రహ్మశ్రీ వేదమూర్తులైన కుప్పా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని మఱువక, ఇం దభిప్రాయములు వ్రాసిన బ్రహ్మశ్రీ పండిత బొద్దనపల్లి వీరభద్రవర ప్రసాదరాయశర్మ, లొల్ల బాలకోటీశ్వరరావు, మద్దాలి వేంకటేశ్వరరావుగార్లకు విధేయుఁడనై, ధనమొసంగి కృతినంది సహాయముచేసిన కొడాలి పున్నయ్యచౌదరిగారికి కృతజ్ఞుఁడనై, తదితర సహాయుల కభివందనము లర్పించెద.

ఈ పొత్తము బాలబాలికల కుపకరించునటుల నాశక్తి కొలఁది రచించితి. ఏవైన దోషములున్న పెద్దలు తెలిపినచో రెండవ ముద్రణమున సవరించుకొనెద. నా కష్టఫలితము సఫలముచేయ విద్యాశాఖాధికారుల ఘనతను కొనియాడెద.

ఇట్లు,

లక్కెన మల్లికార్జునుఁడు,

గ్రంథకర్త.



# అభిమతము

శైవుడగు మహాకవి భర్తృహరిచే విరచింపబడిన శతకత్రయములో సంస్కృతమునను వీరశైవుడగు మల్లికార్జున పండితారాధ్యునిచే విరచింపబడిన శివతత్త్వసారములో నాంధ్రమునను శతకవాఙ్మయ మారంభమైనది. ఉభయభాషలయందును శైవులే శతకకర్తలగుటకుగారణము జగదాదిశతక మనదగు యజుర్వేదశతరుద్రీయ నమక చమక మనవచ్చును.

శతకరచన మించుమించుగ సంస్కృత ప్రాకృతసూక్తుల కనుకరణమైనను, దేశీయములును, జాతీయములును నగు నానుడులు విరివిగ నాంధ్రశతకములలో నుండుటచే స్వభావానుగుణముగ నాంధ్రులకు శతకములమీఁది మక్కువ యెక్కువ.

సుమతిశతక మాబాలగోపాలముగ ప్రచారమును నంది యున్నను, 'చేడెల యధరామృతంబు చెందనినోరున్' మొదలైన భావము లుండుటచే బాలురకు నిస్సంకోచముగ బోధనీయము కానేరదు. కవిరత్న, శ్రీ లక్కన మల్లికార్జునుఁడుగారు, స్వయముగ నుపాధ్యాయులగుటచే బాలుర హృదయానుకూలముగ సరళమగు నీ పుత్రి శతకమును రచించిరి. ఈ ద్దేశపూర్వకముగనే యీశతకమునందు లౌకికములగు శబ్దార్థభావములు సులభముగ బ్రయోగింపబడినవి. విద్యాస్థానాధికారులీ పొత్తమును ఆంధ్రపాఠశాలలయందు అనివార్యపఠ్యముగ నిర్ణయించినపుడే కవిగారి పరిశ్రమ సఫలము కాఁగలదు. మల్లికార్జునుడుగారు ఇతోఽప్యతిశయాభ్యుదయము నంది యువవృద్ధ శతకములను ఆంధ్రభారతీమాత కర్పింతురుగాక.

వీరశైవ గురుకులము, }
సికిందాబాదు. }

చి. ము. వీరభద్రశర్మ.

# తొలిపలుకు



నేనొకనాడాకస్మికముగ వల్లూరుపాలెము బోర్డు బాలుర పాఠశాలఁ జూచుటకు వెళ్లినప్పు డక్కడ ఉపాధ్యాయుఁడుగఁ బనిచేయు శ్రీ లక్కన మల్లికార్జునుఁడుగారు వ్రాసిన పుత్రశతకము చదువుట తటస్థించినది. వీరు మల్లికార్జునశతకము, శ్రీ సీమంతిని, కరిబసవేశ్వరబోధామృతము అను చిన్న పుస్తకములను కూడ చూపిరి. ఈపుత్రశతకమునకు తొలిపలుకు వ్రాయుఁడని కోరిరి.

ఈపుత్రశతకము కేవలము మంచి నీతిని నేర్పుపద్యముల సమూహము. సులభశైలిలో వ్రాయఁబడినది. బాలబాలికలకు మంచిసలహాలను మంచిప్రవర్తనలను సూచించు హితములు నేర్పు చక్కని పద్యశతకము. ఇవియన్నియు నేల? ప్రాథమిక పాఠశాలలో చక్కగ నేర్చుకొనఁదగిన నీతిశతకము.

ప్రస్తుతపు వాచకములలో కొన్ని నీతిపద్యములున్నవి. వానితో పాటు ఇవి నేర్చుకొనదగినవి. అనేకవిషయములు సత్సంగము, దైవసములు, చదువు, వినయము, సంపద, అభిమానము, ధైర్యము, ఉపకారము, సదయులు మొదలగు అమూల్యమైనవిషయములగురించి బాలురకు నేర్చుకొనదగురీతిగ వ్రాయఁబడినవి. సాధారణముగ మంచిపద్యములు పిల్లలు తిరిగి చక్కగ పుస్తకసహాయములేకుండ కంఠతఃనేర్చుట మంచిది. అట్టివిధముగ నేర్చుకొనదగిన అమూల్యమైన పద్యశతకము.

ప్రతిపద్యము నర్థగాంభీర్యము నేర్చుకొనదగినవిషయము గల్గియున్నది. శతకములు పూర్వకాలపునాటివని తలంపవచ్చును. ప్రవర్తన చక్కగానుండుటకు సహాయపడుసలహా లెప్పటికైన నాచరించవలయును. వేమన శతకము ఎట్లు నేర్పుదురో అట్లు ఈపుత్రశతకముగూడ నేర్పదగినది.

ఈ శతకము వ్రాయుటలో శ్రీ లక్కన మల్లికార్జునుఁడుగారు వారి యనుభవము నుపయోగించిరి. పాఠశాలలో బాలబాలిక లేవిధముగ నేర్చుకొనుటయం దాసక్తిచూపుదురో యవ్విధమున ననేకవిషయములు బోధించుటకు వ్రాసిన శతక మిది.

అనేకశతకములలో నిది యొకటిగా నెంచక పాఠశాలలో నీశతకములోని అమూల్యవిషయములు బాలురు నేర్చుకొని ఆచరణలోనుంచి సత్ప్రవర్తన నలవరచుకొనినయెడల ఈశతకము వ్రాసిన ఉద్దేశము నెరవేరును. అచ్చువేసినంతమాత్రమునను పిల్లలు కొనినంతమాత్రమున నుపయోగము లేదు. ఆచరణలోనికి వచ్చుటకు శతకపద్యములు మనమునందుంచుకొని వీలైనంత వరకు ఇతరులకు నేర్పుచు ననుభవములోనికిఁ దెచ్చిన దీనివిలువ తెలును.

శ్రీ మల్లికార్జునుఁడుగారు ఇటువంటి విషయము లనేకము లింకను బాలుర యుపయోగార్థము వ్రాసి వారికి జ్ఞానోదయము కలుగఁజేయుటకు ప్రయత్నించుదురని నమ్ముచున్నాము.

"ఈనాటిబాలురు రేపు పౌరు"లను లోకోక్తి యున్నది. ఈనాటి బాలురు శతకములో నేర్పినటువంటి విషయములు బాగుగా నేర్చినచో రేపు పౌరులగునపుడు వారివిధులను చక్కఁగ నెరవేర్చుకొనుచు దేశసేవ చేయఁగలుగుదురు. కనుక పసితనమునందు బాలు రిట్టి విషయములు నేర్చుకొనుట దేశమున కుపకారము చేయుటయని తలంచవలెను.

ఈ పుస్తకము చక్కఁగ ప్రకటింపబడి ప్రతియింట నుండి బాలుర విధులను నేర్పునని నమ్ముచున్నాను.

అట్టి పుస్తకమునకు "తొలిపలుకు" వ్రాయునప్పుడు దానియొక్క విలువను మెచ్చి ఉత్సాహము సంతసము చూపుచు, బాలురకు నేర్పదగినవి వెల్లడిచేయుటకు ఈ తొలిపలుకు వ్రాయ సాహసించితిని.

ఇట్టి నీతిదాయకములగు గ్రంథముల నేకములు వ్రాయుటలో గ్రంథకర్తగారికిని నేర్చుకొనుటలో బాలురకు నెల్లప్పుడు దైవము తోడ్పడునని ప్రార్థించుచున్నాను. నేర్చుకొనదగిన పఠనీయ పుస్తకమని నమ్ముచున్నాను. ఈ పుస్తకమునకు తగు ప్రోత్సాహము వచ్చుగాక.

వల్లూరుపాలెము,
9—11—38.

కుప్పా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి,
సీనియరు డిప్యూటి ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సు,
బెజవాడ.

# పండితాభిప్రాయములు

కవిరత్న శ్రీలక్కన మల్లికార్జునుఁడు గారిచే విరచింపబడిన పుత్రశతక మను నీతిగ్రంథము నచ్చటచ్చట పఠించితిని. గ్రంథశైలి హృద్యమై సరస వచోలాలితమై యొప్పుచున్నది. ఇందలినీతులు బాలురు పఠించి తప్పక ఆచరింప గలుగుదురని నా యాశయము. సాంఘికములుగా పౌరాణికము లుగా నైతికములుగా పెక్కుగ్రంథముల నిట్లే యీకవి రచించి భగవ త్కృపావిలసితుం డగుగాకయని యాశాసించుచున్నాను.

మచిలీపట్నము, ది 26—10—37.

బి. వి. వరప్రసాదరాయశర్మ,
వ్యాకరణవిద్యాప్రవీణ.

---

పుత్రశతకమును సంపూర్ణముగ చదివితిని. పద్యములు రసవంతములు. శైలి సులభము. నీతులకు నిధి. ఇయ్యది బాలురకత్యంతోపయుక్తగ్రంథము. బాలురమానసములు కోమలములు. కోమలహృదయములందుబడిన నీతిబీజ ములు వారిపురోవృద్ధి కనుకూలమనుట నిర్వివాదాంశము. నీతులు వచన పూర్వకముగ తెలియజేయుటకంటె, పద్యరూపమున వల్లనవేయించిన, అవి వారికి ఆజన్మాంతము జ్ఞప్తికివచ్చుచునేయుండును. బాలురకు సత్ప్రవర్తన కలుగచేయువిధి యుపాధ్యాయులదై యున్నది గనుకను, నట్టి సత్ప్రవర్తన కలుగజేయుటకు నీతులపెన్నిధియైన యొక పాఠమును తాత్పర్యసహిత ముగ బోధించు టొకమార్గముగనుకను, అట్టి నీతులనిధి యీ పుత్రశత కమే అయియున్నది గనుకను, ఉపాధ్యాయబృందమును, శ్రీ విద్యాశా ఖాధికారులును, ఈ పాఠమును పాఠశాలలయందు 2, 3 తరగతులకు పఠ నీయ గ్రంథముగ నేర్పాటుచేసి గ్రంథకర్తకు ఉత్సాహము కల్పింపగలం దులకు ప్రార్థించుచున్నాను. కవిత్వసరణిచూడ ఈ గ్రంథకర్త ఇంక పెక్కు గ్రంథముల కల్పించి మానవలోకమునకు భాషాగంధము వెదజల్ల సమర్థుడుగ కన్పట్టెడిని. కాన భగవంతుడు గ్రంథకర్తకు ఆయురారోగ్యములు కలుగ జేయ ప్రార్థించుచున్నాడ.

ఇట్లు,

బోర్డు ఉన్నతప్రాథమికపాఠశాల, వల్లూరుపాలెము, 30-10-1937.

లొల్ల బాలకోటీశ్వరరావు,
ప్రధానోపాధ్యాయుఁడు.

---

మన్ని తుస్త్రిడును, వీరశైవకులభూషణుడును, "గ్రహణధారణ పటుః బాలః" అనునట్లు బాలుడును, "కవిః = కవితాకల్పకవక్తా ఇతి" అనునట్లు కవియు నగు శ్రీ శ్రీ శ్రీ కవిరత్న లక్కన మల్లికార్జునుఁడుగారిచే విరచింపబడిన పుత్రిశతక మచ్చటచ్చట బరికించితిని.

శైలి మృదుమధురము, సరసపదగుంఫితము, భక్తి యుక్తి ముక్తి నీతి దాయకము. ఈపాత్రము చిఱుతలపాలిటి జేజేలమ్రాకన నొప్పు.

ఇటు లీబాలకవి పెక్కుగ్రంథముల రచించి యశోవిశాలుండగుగాత.

ఇట్లు,

క్యాంపు - వల్లూరుపాలెము,
29—10—37.

మద్దాలి వేంకటేశ్వరరావు,
ఆయుర్వేద శిరోమణి.



# కృతిసమర్పణము



శా. శ్రీవైవాహికవేదికం దనరు స♦చ్ఛీలాన్వితుల్ మానులుం
భావింపంబడుమాసతిన్ మమతచే ♦ వాంఛించి వీక్షించునా
దేవాధీశుఁడుమాధవుండు సిరులం ♦ దేజంబులం గూర్చి సం
భావించుంగాదయఁ బున్నయాఖ్యునిమహా♦వ్యాపారధౌరేయునిన్.

క. మృదుమధురార్భటిభాషలు
సదమలభావంబు ధైర్య♦శాంతంబులు స
మ్ముదమునఁ బ్రోవై చేరెను
సదయుండగు పున్నయాఖ్యు♦సన్నిధియందున్.

సీ. వికసింపఁగాఁజేసె ♦ నకలంకమాకీర్తి
గ్రామాభ్యుదయముకై ♦ కష్టపడుచు
మెరపించె తనప్రజ్ఞ ♦ మేటివారలయందు
లౌకికజ్ఞానంబు♦లం గడించి
శత్రులపంతముల్ ♦ సమసిపోవఁగఁజేసె
పరమశాంత్యాది సం♦పద వహించి
తులకించె శిబి యన ♦ దొడ్డగుణాఢ్యుఁడై
యర్థులు నర్థించు ♦ నర్థము లిడి

గీ. సకలసంపదలం గాంచి ♦ సౌఖ్య మందె
పరఁగఁ బురుషార్థసంపదఁ ♦ బడసి మించె
శిష్టుఁ డా కొండాలికులాబ్ధి♦శీతకరుఁడు
పున్నయాఖ్యుండు సుజనుల♦మిన్న యతఁడు.

సీ. శారదనీరద♦పారదేందు పటీర
హారమరాళడిం♦డీరకముల
ఘనసారఫణిరాజ ♦ కైలాసకంధర
తారశారదసిత♦వారిజముల

కల్హారతుహినాగ ♦ కామధేనుల శంఖ
పూర్ణచంద్రికదర్భ ♦ పుష్పకముల
దుగ్ధపాథోధిపై ♦ దొసగివనురుగుల
మల్లికాసంపుల్ల ♦ మండలముల

గీ. కధికమై ధవళంబునై ♦ యాశ లరసి
యొసఁగు నీకీర్తి వర్ణింప ♦ నెవరితరము ?
అబ్ధిగంభీర ! నిరుపమా ♦ నందధీర !
అమలగుణసాంద్ర ! శ్రీ పున్న ♦ యార్యచంద్ర !

సీ. సకలసంపదలచే ♦ శాంత్యాదిసడతల
ఘనకీర్తి నార్జింత్రు ♦ కమ్మవారు
వ్యవసాయవృత్తిచే ♦ పాలనాధిక్యత
నిమ్మహి ఘనులైరి ♦ కమ్మవారు
ఐకమత్యతచేత ♦ నాదరగుణముచే
కామితార్థములిత్తురి ♦ కమ్మవారు
అన్యమతస్థుల ♦ కాధారములుచూపి
ఘనముగా మన్నింతురి ♦ కమ్మవారు

గీ బీదసాదల కన్నంబు ♦ పెట్టువారు
కమ్మవా రట్టివారిలో ♦ ఘనుఁడు నితఁడు
పున్నయాఖ్యుండు ధీరుండు ♦ పుణ్యతముఁడు
కోటయాఖ్యుని పుత్రుండు ♦ కోవిదుండు.

క. ఎన్నో శుభముల నాతఁడు
చెన్నుఁగ నా కొసఁగియుంట ♦ నిది యర్పింతున్
చెన్నుగ నిలఁగలదాఁకను
మిన్నగ నలరారునట్లు ♦ మేదినియందున్.



# పుత్రశతకము



### దైవస్తుతి

క. శ్రీగిరిజాహృదయేశుని
రాగద్వేషాదిదళితుఁ ♦ రమ్యచరిత్రుం
భోగీశభూషితాంగుని
సాగరగంభీరుఁ దలఁతు ♦ సతతము పుత్రా. 1

క. విఘ్నక్ష్మాధరవజ్రిని
విఘ్నేశుని శంభుసుతుని ♦ విద్యానిధినిన్
విఘ్నాంధకారభానుని
విఘ్నంబులు గలుగకునికి ♦ వేఁడెద పుత్రా. 2

క. సరసిజభవునకు, వాణికి
కరయుగళము మోడ్చి భక్తిఁ ♦ గరివరదునకున్
సిరికిని వందన మొనరిచి
హరురాణి భజింతు నాత్మ ♦ ననిశము పుత్రా. 3

### కవిస్తుతి

క. శ్రీనాథు నన్నెచోడుని
భాను న్నల సోమనాథు ♦ భవభూతిని భా
షానిధి నన్నయఁ దిక్కనఁ
మానసమున మరువకుంట ♦ మంచిది పుత్రా. 4

క. గురుతర కావ్యము లిలపై
స్థిరతరముగఁ జేసి పేరు ♦ చెందినకవులన్.

సురుచిర శాస్త్రజ్ఞుల వే
మరు మదిలోఁ దలఁచుటెల్ల • మంచిది పుత్రా. 5

క. వేదంబులు శాస్త్రంబులు
మోదంబునఁ జదివి ధీర•ముఖ్యుఁడు నై స
మ్మోదమున వీరశైవపు
బోధల నిడు వీరభద్రుఁ • బొగడుదు పుత్రా. 6

## ధర్మము

క. తన మతధర్మము నెప్పుడు
మనమున నాచరణయందు • మనుచుండవలెఁ
ఘనము స్వధర్మాచరణము
కనఁ బరమతములను వదలఁ•గావలెఁ బుత్రా. 7

## వేదశాస్త్రములు

క. మనపెద్దలు వేదాగమ
ఘనషట్ శాస్త్రముల లోక • కల్యాణముకై
వినియోగించి రచించిరి
కని శాస్త్ర విధాన గామి • కావలెఁ బుత్రా. 8

## వీరశైవము

క. గురులింగ జంగమంబులు
వరముగ రుద్రాక్షభూతి • పంచాక్షరియున్
మరి పాదోద ప్రసాదము
లిరవుగ శివమతమువారి • కిష్టము పుత్రా. 9

## దైవసములు

క. శ్రీకరవిద్యలఁ గఱపుచు
ప్రాకటముగ నీతిఁగఱపి ♦ భవ్యశుభంబుల్
చేకూరఁ జేయువారలు
నీ కెప్పుడు దైవసములు ♦ నిక్కము పుత్రా. 10

క. జననీజనకులు నొజ్జలు
మునుకొని జ్ఞానంబుదెల్పు ♦ పుణ్యాజనంబుల్
తనయగ్రజన్ము లాఢ్యులు
మనుజునకుం దైవసములు ♦ మహిలోఁ బుత్రా. 11

క. దేశక్షేమముకొఱ కా
వేశంబున బడఁగరాని ♦ వెతలం బడి తా
మాశాపాశముల న్విడి
వాసిని గైకొన్నవారు ♦ వంద్యులు పుత్రా. 12

క. నీతులఁ బెక్కులు చిల్కఁగఁ
బాతక ముడుపంగఁజాలు ♦ పద్ధతులెన్నో
ఖ్యాతిగ నెరపిన గ్రంథవి
ధాతయె భారతమునందు ♦ ధన్యుఁడు పుత్రా. 13

## సత్సంగము

క. బుద్ధివికాసం బొసఁగును
శుద్ధవినీతి నిడి కీర్తి ♦ శుభదాయకమై
విద్దెలఁ బెక్కులొసంగును
ఇద్ధర సత్సంగమంబు ♦ నెఱుఁగుము పుత్రా. 14

క. పండితగోష్ఠిని జేసిన
దండిగ ధర్మంబు దెలియు ♦ తామస ముడుగున్
మెండైన విద్యలబ్బును
నిండును నీపేరు దిశల ♦ నిక్కము పుత్రా. 15

క. పెద్దలయాజ్ఞలవెంట న
నుద్ధతిఁ జరియించుచుండి ♦ యురుతరభక్తిన్
పెద్దల సేవలఁ జేసిన
సిద్ధించు జయంబు నీకు ♦ సిద్ధము పుత్రా. 16

## చదువు

క. చదువే జ్ఞానమొసఁగును
చదువే గురుభోగభాగ్య ♦ సంపద లొసఁగున్,
చదువే పాత్రతనొసఁగును
చదువే సత్కీర్తినొసఁగు ♦ చదువుము పుత్రా. 17

క. మృదు మాధుర్యంబులు నె
మ్మది కింపు లదభ్రకీర్తి ♦ మాన్యంబులు దు
ర్మదభేదనపలుకుల నా
చదువే సతతంబునొసఁగు ♦ చక్కఁగఁ బుత్రా. 18

క. ఒరులకు నిచ్చినకొలఁదిని
తఱుఁగక, మితిమీరఁబెరిగి ♦ ధనమును యశమున్
సురుచిర విజ్ఞానంబులు
స్థిరతరముగ చదువొసంగు ♦ సిద్ధము పుత్రా. 19

క. కులభేదము లెంచక భువిఁ
గల పండితవరులఁ జేరి ♦ కాంతిదలిర్పన్

గడియింపుము సద్విద్యల
కలుగును సౌఖ్యంబు నీకు ♦ గట్టిగఁ బుత్రీ. 20

క. తెలిపెడి విషయము లెఱుఁగుచు
తెలియని విషయంబు భక్తిఁ ♦ దెలుపుమటంచున్
పలుకుము గురువుల సన్నిధిఁ
గలుగును సద్విద్య నీకు ♦ గట్టిగఁ బుత్రీ. 21

## వినయము

క. వినయమె బహుజనమైత్రిని
ఘనతరమాశక్తి యోర్పు ♦ కామితఫలముల్
ఘనకార్యపూర్తులను స
ద్గుణనికరము నొసఁగు బుద్ధి ♦ గుదిరినఁ బుత్రీ. 22

క. తలిదండ్రుల గురువులయెడ
లలితాత్ములయొద్ద గొప్ప♦రాజులయొద్దన్
లలి విద్వాంసులచెంతను
వెలయఁగ వినయంబుఁజూప ♦ విధియగుఁ బుత్రీ. 23

## సంపద

క. తనగడనఁబట్టి వ్యయమును
ఘనుఁడైనను జేయుటొప్పు ♦ గనుఁగానక తా
ఘనముగ వ్యయమును బెట్టిన
ఋణములచేఁ జిక్కి చెడును ♦ ఋజుగతిఁ బుత్రీ. 24

క. కలుత్రాగువాని యింటను
కులకాంతల బల్మిఁబట్టు ♦ కుమతులయింటన్

తలపఁగ జూదరియింటను
నిలువఁగ సిరి నిముసమైన ♦ నిక్కము పుత్త్రా. 25

క. గుణసంపద ధరియించియు
తనవృత్తిని సల్పుచుండి ♦ ధర్మాత్ముఁడవై
మనుజుల హింసింపక తా
ఘనుఁడై చరియింప ధనము ♦ గల్గును పుత్త్రా. 26

క. కలవారిమనసెఱిఁగి భూ
తలపతియాజ్ఞల మెలంగి ♦ తమగురుకృపతో క్ష
స్థల మెఱిఁగి కాల మెఱిఁగియు
మెలఁగిన నీకబ్బు డబ్బు ♦ మేదినిఁ బుత్త్రా. 27

క. మితముగా వ్యయమును జేయుచు
నతిథులకన్నంబు లిడుచు ♦ నతిశాంతుఁడవై
హితవాక్యంబులఁ బలుకుచు
పతితులఁ గాపాడ ధనము ♦ వర్ధిలుఁ బుత్త్రా. 28

## అభిమానము

క. మనయాంధ్రభాషమీఁదను
మనయాంధ్రజనంబుమీఁద ♦ మహిమాస్పదమౌ
మనయాంధ్రభూమిమీఁదను
మనుజున కభిమానముంట ♦ మంచిది పుత్త్రా. 29

క. తనవంశస్థులమీఁదను
తనగ్రామజనంబుమీఁద ♦ తనభూపతిపైఁ
దనజన్మభూమిమీఁదను
ఘనముగ నభిమానముంట ♦ కర్జము పుత్త్రా. 30

## ధైర్యము

క. పరమేశుఁడు తనశక్తులు
నరునకు నిడెననుచు మదిని ♦ నమ్ముచు దానిన్
మఱువక ధైర్యము విడువక
చరియింపుము చేఁతలందు ♦ జయమగుఁ బుత్రీ. 31

క. ఉరుతరకార్యములెన్నో
ధరపై సమకూరుచుండు ♦ ధైర్యమువలనన్
స్థిరతర కీర్తియు శాంతియు
సిరి సౌఖ్యము లబ్బుచుండు ♦ సిద్ధము పుత్రీ. 32

## ఉపకారము

క. తనశక్తికొలఁది మానవుఁ
డెనయఁగ నుపకార మొరులు ♦ కెనఁగఁగఁజేయన్
అనవరత మొరులు వానికి
ఘనశుభములు గూర్చుచుండ్రి ♦ గట్టిగఁ బుత్రీ. 33

క. చెంతకు శత్రువు చేరిన
నుంతయుఁ దప్పరయకుండి ♦ శుభములు నిడ వాఁ
డెంతో శిక్షను గని మొదఁ
జింతించునటంచు శ్రుతులు ♦ చెప్పును పుత్రీ. 34

క. పరహితము చూడ లేకయు
పరులకు నష్టంబుగూర్ప ♦ భావించినచోఁ
బరమేశుఁడె నిను చెఱచును
పరహితముంజేయ శుభము ♦ ప్రబలును పుత్రీ. 35

క. తను వున్ననాఁడె పురుషుఁడు
ఘనముగ నుపకారపరుఁడు ♦ కావలెనుగదా
తను వుడిగనేని పీనము
కెనయగునా యత్నపరత ♦ నెసఁగినఁ బుత్రా. 36

## స ద యు లు

క. సదమలవర్తన శాంతము
పదిలంబును దాంతి విద్య ♦ భక్తిప్రతతుల్
సదయులకు భూషణంబులు
కదలవు ప్రళయాగ్నికైన ♦ గట్టిగఁ బుత్రా. 37

క. పరకాంత జననిగాఁ గని
చరియింపుచు దేవపూజ ♦ జరుపుచు గుణశే
ఖరు లీ దేశక్షేమము
కొఱకై కష్టించుచుంద్రు ♦ గొప్పగఁ బుత్రా. 38

క. ఇలపైఁ బురుషులనేకులు
కలుగుచు నశియించుచుంద్రు ♦ ఘను లటుగాకన్
పలుధర్మంబుల నెఱుఁగుచు
స్థిరతరముగ దేశసేవ ♦ సేతురు పుత్రా. 39

క. ఎందరో ధీరులు జననం
బంది తగినవసతిలేక ♦ యల్లాడి యశం
బందక కూలుదు రడవిని
క్రిందంబడి యుడుగుపూల♦రీతినిఁ బుత్రా. 40

క. పొచ్చెంపు విధము లొల్లక
నచ్చుగ ధర్మంబు లెఱిఁగి ♦ యనువర్తనతో

సచ్చరితులు తమ దేశపు
లచ్చికకై పెనఁగుచుంద్రు ♦ రహిచేఁ బుత్రా. 41

క. నీరముకానని పంటకు
నీరదముల్ గురియు ఫలము ♦ నెగడినరీతిన్
ధీరాత్ముల కిడి విత్తము
ధారుణి సత్కీర్తిగాంతు్రు ♦ ధన్యులు పుత్రా. 42

క. కష్టమె దుఃఖప్రదమగు
కష్టమె ఘనశక్తు లడఁచు ♦ కష్టమువలనన్
నష్టము లధికము లౌ నా
కష్టములే నరకుగొానరు ♦ ఘను లిలఁ బుత్రా. 43

క. చదువుచు ధర్మము లెఱుఁగుచు
సదమలభావంబు లంది ♦ సద్గతిపరులై
చదివి గ్రహించిన నీతులు
ముదమున విధియించుచుంద్రు ♦ పుణ్యులు పుత్రా. 44

## ని బం ధ న లు

క. అలివేణు లున్నచోటున
నిలపతిసభలందు పెద్ద ♦ లెసఁగినచోటన్
పలుకకు పరుషము లెప్పుడు
పలికినఁ జెడు సంభవించుఁ ♦ బదిలము పుత్రా. 45

క. దురితాత్ము లున్నచోటున
కలకలులగుచోరు లున్న ♦ కలకులయందున్
గలపకు నీతుల నెప్పుడు
గలపిన దండింతు్రు నిన్ను ♦ గట్టిగఁ బుత్రా. 46

క. కలహింపుచు గడుసరివై
యలుకున నెదిరింపఁబోకు ♦ మధికులతోడన్
పలుకకు బూతుల నేతటిఁ
గలుగును క్షేమంబు నీకు ♦ గట్టిగఁ బుత్రా. 47

క. ఎదురాడవలదు గురువుల
కధికారుల చెంతఁ గల్ల♦లాడకు పుణ్య
ప్రదమగు ధర్మము మఱవకు
చదువుపయిన్ విడకు మాశ ♦ జయమగుఁ బుత్రా. 48

క. నమ్మిన మిత్రునిఁ జెఱచుట
కొమ్మలఁ జెఱపట్టియుంట ♦ కుటిలపు బుద్ధిన్
సొమ్ముల దోఁచుట దీనుల
వమ్ముగ బాధించుచుంట ♦ వలదుర పుత్రా. 49

క. చాడీలు చెప్పఁబోకుము
వీడకు పరమేశుభక్తి ♦ వేఁడుక మీరన్
గూడుము సుజనులతోడుతఁ
బాడకు మపశబ్ద మొలుకఁ ♦ బద్యము పుత్రా. 50

క. ధైర్యము నాపదవేళల
శౌర్యము రణభూమియందు ♦ సంపదలం దౌ
దార్యముగల తాల్మి వినయ
మార్యులయెడఁ జూప యశము ♦ లబ్బును పుత్రా. 51

క. పట్టుదల కార్యములయెడఁ
గట్టడి ధర్మంబులందు ♦ ఘనమా ప్రేమన్

జుట్టంబులందుఁ గలహాపు
బట్టున మానంబు చూప ♦ భవ్యము పుత్రా. 52

క. అద నెఱిగి పనులఁ జేయుము
వదలకు శరణన్న వారిఁ ♦ బాపులయొద్దన్
మెదలకు చనువు నొసంగుచు
నధనుల హింసింపఁబోకు ♦ నయమగుఁ బుత్రా. 53

క. తలఁపకు మీర్ష్యల నెమ్మదిఁ
గులభేదము లెంచకుండి ♦ కోవిదవరులన్
తలఁపుము ఘను లంచును చేఁ
తలయెడ బద్ధకము చేర్పఁ ♦ దలపకు పుత్రా. 54

క. సిరి చెడి చుట్టముడఱికిని
నరుగకు సన్మిత్రుఁ జేరి ♦ యందుము శుభముల్
చరియింపకు సోమరివై
మఱువకు నిజవృత్తివిధము ♦ మంచిది పుత్రా. 55

క. తెలిసియుఁ దెలియని వార్తలు
తెలుపకు, గృహమందుగుట్టు ♦ నెల్లముకాఁగన్
బలుకకు, పోషించెడు నరుఁ
దలఁపకు చెడఁగొట్ట మేలు ♦ దనరును పుత్రా. 56

క. యాచకుల బాధఁ బెట్టకు
మాచారము వదలఁబోకు ♦ మరితో నెపుడున్
దాచక మర్మము చెప్పకు
తాత్రిచులతోఁ జెలిమి వలదు ♦ తథ్యము పుత్రా. 57

క. నియమిత కాలములోపల
నియమితకార్యములఁ జేసి ♦ నిర్మలమతితో
జయమిడు దేవుని గొల్వుము
జయమెప్పుడు నీకుఁ గల్గు ♦ సత్యము పుత్రా. 58

క. తలిదండ్రు లన్నదమ్ములు
లలి బంధుగణంబు మిత్ర ♦ రాజులు నీకుం
గలుగఁగఁ జేతురు శుభములు
కలకాలము వారిఁ బ్రేమఁ ♦ గాంచుము పుత్రా. 59

క. గర్వంబుచేత మర్త్యులు
సర్వాత్ములఁ గానలేరు ♦ సగౌరవముగా
సర్వత్ర పడయఁజాలరు
గర్వము విడనాడ మేలు ♦ గందురు పుత్రా. 60

క. మతకరిమాటలు నమ్మక
మతిహీనుల పొత్తు గనక ♦ మంచిని గని పం
డితులను నిందింపక నీ
వితరులపై నీర్ష్యగనక ♦ యొసఁగుము పుత్రా. 61

క. దున్నలు పొడువఁగ వచ్చిన
నన్నా! శిక్షింపవలెను ♦ నటుచేయనిచో
మిన్నక యుండియు తొలఁగుట
సన్నుతమై తనరునండ్రు ♦ సదయులు పుత్రా. 62

క. నుడువుల సరసము లెరుగక
సదమలమా తోవ గనక ♦ సంపద గల దం

చెడ గర్వము గలిగిన యా
చదు వెఱుఁగని దున్నకడకుఁ ♦ జనకుము పుత్రా. 63

క. పరులకు కలిగిన సిరిఁ గని
నిరతము సహింపలేక ♦ నీచాత్ముఁడునై
దురుసులఁ బల్కెడి దున్నకు
కరముగ చనువీయఁబోకు ♦ ఘనమగు పుత్రా. 64

## కారణములు

క. నడవడి కీర్తికి మూల
మ్మడకువ మూలంబు విద్య ♦ లార్జించుటకుఁ
దోడ వగు ధర్మము కలిమికి
చెడుటకు మూలంబు చెడ్డ ♦ చేఁతలు పుత్రా. 65

క. చెలిమికి మూలము ప్రియము
మ్మలుకకు మూలంబు లీర్ష్య ♦ లంచితభోగం
బుల కాధారము విత్తము
పలుకుకు మూలంబు మంచి ♦ భావము పుత్రా. 66

క. వలపునకు తలఁపు మూలము
కలఁతకు మూలంబు తృష్ణ ♦ కయ్యంబులకుం
దలఁపఁగ మూలము పంతము
తెలివికి మూలంబు విద్య ♦ తెలియుము పుత్రా. 67

## పస

క. పలుకే పస సభలోపల
కులుకే పస వేశ్యలకును ♦ కుజనుల కెంతో

యలుకే పస భోగులకును
వలపే పస దీనిఁ దెలియ ♦ వలయును పుత్రా. 68

క. పేకే పస సోమరులకు
ఆకే పస కోమ్ములకును, ♦ వ్యర్థుల కెప్పుడున్
షోకే పస, లోభులకును
రూకే పస పృథ్విలోన ♦ రూఢిగ పుత్రా. 69

## ఫలరహితములు

క. జలధిని గురిసిన వర్షము
ఫలరహితం బైనయట్లు ♦ పామరుఁ డగుచున్
కలవారి కొసఁగు విత్తము
తలఁపఁగ ఫలమీయలేదు ♦ తథ్యము పుత్రా. 70

క. వేతన మీయని కొల్వును
ఖ్యాతికి రానట్టి విద్య ♦ కష్టములందున్
చేతోడు లేని మైత్రియు
భూతలమున నిష్ఫలములు ♦ ముద్దులపుత్రా. 71

క. అర్థులు వేఁడిన నీయని
యర్థము నేరంబుగనని ♦ యవనీశత్వం
బర్థము లొలుకని పలుకులు
వ్యర్థంబులుగావె చూడ ♦ నవనిని పుత్రా. 72

క. ధర్మము లెఱుఁగని యొజ్జయు
మర్మంబులఁ గానలేని ♦ మంత్రియు పతిపై
నర్మిలిఁ బొందని భార్యయు
నిర్మలఫల మీయ లేరు ♦ నిక్కము పుత్రా. 73

క. అడవినిగాచెడి వెన్నెల
నడవడిలేనట్టిబోధ ♦ నయవినయమ్ముల్
పడయని పండితరీతులు
పుడమిని వ్యర్థంబులయ్యు ♦ పొల్పుగ పుత్రా. 74

క. పరులకుఁ బెట్టక కుడువక
నిరతంబును లుబ్ధబుద్ధి ♦ నిస్తులబాధల్
భరియించుకొంచు దాచెడి
సిరి యేటికి నిష్ఫలంబు ♦ సిద్ధము పుత్రీ. 75

క. నరజన్మ మెత్తినందుకు
పురుషార్థము లందవలెను ♦ మూర్ఖుం డగుచున్
ధర నూరేడులు ఫలమా
పరఁగఁగ వేయేండ్లు కాకి ♦ బ్రతుకదె పుత్రీ. 76

**చెనటి**

క. కసిఁబొాయని మనుజుండును
యశమందఁగ లేనిరాజు ♦ నాలికి దయతో
నశనముపెట్టని భర్తయు
నిశియందు చరించు నసుర♦నికరము పుత్రీ. 77

క. నేరము చేయక యున్నను
ఘోరంబుగఁ దిట్ట నెదురు ♦ కూయకయున్నన్
కూ్రరాత్ముఁడు కీడెంచును
ఘోరంబుగ సుజనమతులు ♦ కుందఁగ పుత్రీ. 78

క. కులగిరి కదల్పవచ్చును
బలమున ననలంబు చేతఁ ♦ బట్టఁగవచ్చున్

తలఁపఁగ మూర్ఖుని చిత్తము
లలి బోధల మార్పలేరు ♦ రహిచేఁ బుత్రా. 79

క. ధనమే యిహముం బరమని
ధనమే తన దైవ మంచు ♦ దయఁగాంచక తా
ఘనులను హింసలఁ బెట్టెడి
చెనటిని మెప్పించలేరు ♦ సిద్ధము పుత్రా. 80

క. కలిగినదానఁ దృప్తిని
బడయక యమితాశ నంది ♦ బహుభంగుల భూ
తలమున నిరుపేదలకున్
కలకాలము కీడుచేయుఁ ♦ గష్టుఁడు పుత్రా. 81

క. ధనతృష్ణ మీరియుండుట
దనసుతవర్గంబునైన ♦ దార నయిన నా
ధనమును విడనాడి దయన్
మనుపంగాలేఁడు లోభి ♦ మహిపై పుత్రా. 82

క. తానే ఘనుఁడనుచుఁ దనుఁ
దానే కీర్తించుకొనుచు ♦ తామసపరుఁడై
జ్ఞానాత్ముల నిందించెడి
జ్ఞానవిహీనుండు గొప్ప ♦ కష్టుఁడు పుత్రా. 83

క. పరులు పొగడంగ సంతస
పరుఁడై చరియించుఁగాని ♦ పరఁగిన నేరం
బులఁ బేర్కొని యడిగినఁ దా
భరియింపక చెనటి యెదురు♦వదరును పుత్రా. 84

క. తనచోట నున్నతఁడే దా
ఘనుఁడని పెరవారిఁ జూచి ♦ కారులు నుడువున్
తనచోటుఁ బాసినంతనె
మనుపీనుఁగు గాఁడె మూర్ఖ ♦ మనుజుఁడు పుత్రా. 85

క. తనవారు పెక్కు రుండియు
తనయాజ్ఞలు సాగుచుండి ♦ ధన ముండినచో
చెనటి హారినైన సరకుం
గొనక పరిభవించు తానె ♦ గొప్పని పుత్రా. 86

క. చెనటి కధికార మబ్బఁగ
ననఘులు విధిలేక మాన ♦ మందుదు రంతన్
చెనటియు ననలము త్రొక్కిన
వనచరుఁడై గంతులిడుచు ♦ వదరును పుత్రా. 87

క. ధర్మాధర్మము లెఱుఁగక
మర్మంబులఁ గానలేక ♦ మౌర్ఖ్యమునను దు
ష్కర్మంబులఁ జేయునరుఁడు
దుర్మార్గుఁడు రూఢిగాను ♦ దురితుఁడు పుత్రా. 88

## చేయరాని పనులు

క. చోరుం డైనట్ట మర్త్యులు
ఘోరుం డని తిట్టు రాజు ♦ కొరతను వేయున్
సారపుసిరి చెడు నీ వా
చోరత్వము చేయకున్న ♦ శుభమగు పుత్రా. 89

క. కలహము లాడుచు పరుషము
లాలుకంగా పలుకుచున్న ♦ నోరు లెద నిన్నుఁ

తలఁతురు వద రేడివాఁడని
కలహంబులు మానుటొప్పు ♦ గట్టిగ పుత్రా. 90

క. అనృతము లాడుచునుండిన
మనుజులు నిందించుచుందు ♦ మక్కువ విడి నె
మ్మనమున నమ్మరు నిను నా
యనృతం బాడంగవలవ ♦ దరయఁగ పుత్రా. 91

క. పరనిందఁ జేయువారికి
దురితంబును చేరు కూ్రర♦దుఃఖము లమరున్
పరులు విరోధు లగుదు రా
పరనిందను చేయకుంట ♦ భవ్యము పుత్రా. 92

క. బలవంతునితో వైరము
పలుగాకులతోడ చెలిమి ♦ పలువలతోడన్
కలహంబు పెంచుకొనుటయు
బలభేదికి నైన కీడు ♦ పరిబలును పుత్రా. 93

## దాం భి క ము

క. నీతులు చిలుకని బోధలు
పాతక ముడుపంగలేని ♦ భక్తియు మోక్షం
బాతత నీయని జపములు
భూతలమున దాంభికములు ♦ ముద్దులపుత్రా. 94

## వి దు ద ల

క. భానూదయమున తిమిరము
జ్ఞానంబున హీనబుద్ధి ♦ ఘనతరవిద్యా

దానంబున పాపౌఘము
మానంబునఁ గలహ మడఁగు • మహిపై పుత్రా. 95

క. దారిద్ర్య ముడుప వృత్తియు
కెరలిఁ బెంపంగ నీవి • కిల్బిష ముడుపన్
ధారుణిఁ గల జీవంబులఁ
బేరిమితోఁ గాంచుచుండి • వెలయుట పుత్రా. 96

## దానము

క. గమనంబున నలసి యతిథి
యమితాశను నింటఁ జేరి • యన్న మడుగఁ దా
నమృతపదార్థము లిడి యా
గమనాయాసంబు దీర్ప • కర్జము పుత్రా. 97

క. కనకము దానముగా నిడ
మనమందున తృష్ణవిడఁడు • మహి మృష్టాన్నం
బునఁ దృప్తింబడుఁ గావున
ననఘం బగు నన్నదాన • మరయఁగ పుత్రా. 98

క. కన్యాదానముకన్నను
మాన్యంబుల నిడుటకన్న • భక్తిని నెపుడుం
దీనాత్ముల కన్నము లిడ
పుణ్యం బధికం బటండ్రు • పూజ్యులు పుత్రా. 99

క. నరులకు వలసిన ధాన్యము
ధరపై లభియించుఁ గాన • ధాత్రీదానం
బరమర లేకయ చేసిన
పరమార్థము బొంది నరుఁడు • ప్రబలును పుత్రా. 100

## సత్యము

క. సత్యమె సద్గతి నొసఁగును
సత్యమె సత్కీర్తి నొసఁగు ♦ సకలసుఖంబుల్
సత్యమె యొసఁగును కావున
సత్యము నెడబాయకయ్య ♦ జగతిని పుత్రా. 101

క. సిరి యంతఁ బాసిపోయిన
నురుతరకష్టంబులెన్ని ♦ యొదవిన భువి స
చ్చరితుఁడునై నిజ మెంచియు
చరియించిన కీర్తిఁ బొందు ♦ సత్యము పుత్రా. 102

## ఆరోగ్యము

క. ఆరోగ్యమె ఘనభాగ్య
మ్మారోగ్యమె సర్వసంచి♦తార్థము లొసఁగుఁ
ఆరోగ్యమె సౌఖ్యప్రద
మారోగ్యమె శక్తు లిచ్చు ♦ నరయఁగ పుత్రా. 103

## మురికి

క. మురికియె వ్యాధుల మూలము
మురికియె దారిద్ర్యదుఃఖ♦మూలము ధరలో
మురికియె గౌరవహీనము
మురికిని కలనైన నుంచఁ ♦ బోలదు పుత్రా. 104

## నిరువేద

క. కలిమిగలవారు నిరుపే
దలతో కలహించి లేని ♦ తప్పులు పలుకన్

పలుకరె నిజమనుచు జనులు
తలపరు నిర్ధనుల మొరలు ♦ తథ్యము పుత్రా. 105

## పౌరుషము

క. నెరసుల నెన్నెడి ఘనులను
పరుషంబులఁ బల్కి కొట్టఁ ♦ బౌరుషమే? యా
నెరసులఁ జేయక భువిఁ దా
చరియించుట పౌరుషంబు ♦ జనులకు పుత్రా. 106

## భక్తవరులు

క. శివపదసేవాసక్తులు
భవహరు చేరంగనెంచు ♦ పరమాత్ములు స
త్ప్రవిమలమోక్షాసక్తులు
ప్రవిమలవిజ్ఞానపరులు ♦ భక్తులు పుత్రా. 107

## భూతదయ

క. మనుజుండు సర్వజీవుల
మనమునఁ బ్రేమించి మించి ♦ మంచిని గూర్పన్
ఘనతరకీర్తిని బొందుచు
ననఘుం డగుఁగాదె దాన ♦ నరయఁగ పుత్రా. 108

## సంతతి

క. తనపేరు నిల్పఁజాలిన
తనయుం డొకఁడైనఁ జాలు ♦ తండ్రికి పెక్కం
డ్రినయఁగ నీచులు గల్గిన
తనపేరును పాడుచేయు ♦ తథ్యము పుత్రా. 109

## గ్రంథకర్త

క. లక్కనవంశోద్భవుఁడై
చక్కని శివభక్తి గలిగి ♦ సద్గురువులకున్
మ్రొక్కులిడి మల్లికార్జునుఁ
డిక్కబ్బము చేసెనయ్య ♦ యిలపై పుత్రా. 110

క. తన మాతగు నాగమ్మను
మనమునఁ గొనియాడి మ్రొక్కి ♦ మల్లకవీశుం
డనఘాత్ముల సేవింపుచు
ఘనతరసద్గతిని బొందు ♦ గట్టిగ పుత్రా. 111

## మంగళప్రదము

క. జయ జయ లోకాధీశ్వర !
జయ జయ పరమేశ యీశ ♦ జయ భవనాశా
జయ జయ శంకర యంచును
జయముగ పఠియించుచుండు ♦ సతతము పుత్రా. 112

క. మంగళ మో విశ్వంభర
మంగళ మో శ్రీగిరీశ ♦ మాధవమిత్రా
మంగళ మో శశిధర యన
మంగళము లొసంగు మీకు ♦ మాపతి పుత్రా. 113



## ఈ గ్రంథకర్తచే రచింపఁబడిన

## యితరగ్రంథములు



| | | |
|---|---|---|
| 1. సీమంతిని | ... ... | వెల 0-2-0 |
| 2. మల్లికార్జున శతకము | ... | 0-2-0 |
| 3. కరిబసవేశ్వర బోధామృతము | | 0-2-0 |
| 4. గ్రామసౌభాగ్యము (ముద్రణలోనున్నది) | | 0-2-0 |

వలయువారీక్రింది చిరునామాకు వ్రాయవలెను:—


లక్కన మల్లికార్జునుఁడు,

ఉపాధ్యాయుఁడు, వల్లూరుపాలెము. (పోస్టు: తోట్లవల్లూరు)

బెజవాడ తాలూకా, కృష్ణాజిల్లా.


